**HAZRAT SAALAM (R)**
(Telugu)

# హజ్రత్ సాలమ్ (రజి)

మూలం:
**ఇబ్నె అబ్దుష్షకూర్**

అనువాదం:
**సయ్యద్ హుసైన్**

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# హజ్రత్ సాలమ్ (రజి)

మహాప్రవక్త ముహమ్మద్ (స) హామీమ్ సజ్దా ఆయత్‌లు పఠిస్తున్నారు. ఆయనకు ఎదురుగా ఉతబా బిన్ రబియా చేతులు వెనుక నేల మీద ఆనించి మౌనంగా వింటున్నాడు. దైవప్రవక్త(స) పరలోకంలో దైవ తిరస్కారులకు విధించబడే శిక్షను గురించి ఖుర్ఆన్ ఆయత్ పఠించగానే ఉతబా కేకవేస్తూ ఆయన(స) పవిత్ర నోటిపై తన చేతిని అడ్డం పెడ్తూ –

"ముహమ్మద్(స)! దైవం కొరకు నీ జాతి ప్రజలను కరుణించు" అని అన్నాడు.

ఇవి–ముహమ్మద్ (స) రచించిన వచనాలు కావు, దైవం అవతరింపజేసినవి. మానవమాత్రుడివి కావు, ఇవి సృష్టికర్తవి. మక్కా ప్రాంతమంతా దైవవాణితో మారుమ్రోగింది. మదీనా ప్రాంతం కారుణ్యప్రభువు కావ్యగానంతో తన్మయం చెందింది. కాని మక్కావాసులు ఆ ప్రవాహంలో కొట్టుకుపోయారు. అబూ జహల్, అబూ లహబ్ ఆశ్చర్యంతో ఒకరి ముఖాలు మరొకరు చూసుకున్నారు. ఉమయ్యా, షీబా కొయ్యబారిపొయ్యారు. వలీద్ బిన్ ముగ్గైరా నీలుక్కుంటూ చల్లగా జారుకున్నాడు.

ఈ వాణి వారి హృదయాల్లో పెను తుఫాను లేవదీసింది. వారి సహన స్థయిర్యాలు సన్నగిల్లాయి. అయినా వారి హృదయాలు కఠినమయ్యాయి. వారి హృదయాల్లో పారదర్శకత నశించి, అవి పెద్ద బండరాళ్ళుగా మారాయి. వారు తమ చెవుల్లో వేళ్ళు పెట్టుకుని, కళ్ళు మూసుకున్నారు. తమ హృదయాలకు సీలు వేసుకున్నారు.

## దైవగానం

ఈ గానంలో ఎత్తు పల్లాలున్నాయి, పిడుగులాంటి మెరుపు వుంది, మేఘ గర్జన వుంది, సముద్ర ఘోష వుంది– అంతేకాదు దానిలో మంత్ర మహిమ వుంది, అయస్కాంతంలాంటి ఆకర్షణ వుంది. అమృతంతో నిండి వుంది. ఇందులో ఒక లయ వుంది, ప్రభావాన్ని చూపే సత్తువ వుంది, సచ్ఛీలురాలైన ఖదీజా (రజి) దీన్ని విన్న వెంటనే పరవశులైపోయారు.

అబూ బకర్ బిన్ అబీ ఖహాఫా (రజి) ఈ మార్గదర్శకుని పిలుపు వినగానే అప్రయత్నంగా దానివైపు ఆకర్షితులయ్యారు, అలీ ఇబ్నె అబీ తాలిబ్ (రజి) హృదయం ఈ దైవవాణితో ఉర్రూతలూగింది. ఈ సత్య సందేశాన్ని విన్న జైద్ బిన్ హారిస్ హృదయ తంత్రులు మ్రోగటం మొదలయ్యాయి, ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ (రజి) ఆత్మ దైవగాన సౌరభం సోకగానే తన్మయత్వం చెందింది. ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కర్ణపుటాలకు ఈ పిలుపు తాకగానే ఆయన అంతరాత్మ పరవళ్ళు తొక్కింది. ఈ దైవ సందేశం వినగానే నజాషీ నయనాలు అశ్రుపూరితాలయ్యాయి.

ఈ గానం కాంతులీనుతూ ప్రవహించసాగింది. ఎవరో వాటిని తట్టి పట్టి లేపుతున్నట్లు, వాటిని అదే పనిగా అదిలిస్తున్నట్లు భావించి విశ్రమిస్తున్న ఆత్మలు సైతం మేల్కొని కళ్ళు విప్పి చూడటం మొదలెట్టాయి. **అలస్తు బిరబ్బికుమ్** (నేను మీ సృష్టికర్తను కానా?) అన్న పిలుపును ఇంతకుముందు ఎక్కడో విన్నట్లుగా వున్న ఆత్మల సమూహం, సమాధానంగా– **ఖాలూ బలా** (అవును నీవే మా ప్రభువు) అని అన్నాయి. ఇది వారి ప్రభువు పిలుపు. ఇప్పుడూ వారిని వారి యజమాని పిలుస్తున్నాడు, ముహమ్మద్ (స) అనుచరులు పిలుపును విన్నారు, వారి హృదయ కుహరాల్లో దాగిన ఆత్మలు ఈ పిలుపుకు స్పందించి వారి నోట ఈ వచనాలు వెలువడ్డాయి:

> **"ప్రభూ! మేము ఒక పిలిచేవాడి పిలుపును విన్నాము, అతడు విశ్వాసం వైపునకు పిలిచేవాడు, మీ ప్రభువును నమ్మండి అని అన్నాడు. మేము అతని ఆహ్వానాన్ని స్వీకరించాము. కనుక మా స్వామీ! ఏ తప్పుల్నయితే మేము చేశామో వాటిని మన్నించు, ఏ చెడులైతే మాలో ఉన్నాయో వాటిని దూరం చెయ్యి, మా ముగింపు సజ్జనులయిన వారితో చెయ్యి."**
>
> **(ఆలి ఇమ్రాన్)**

## దైవగ్రంథం

దైవగ్రంథ సాగరంలో వివేచనా ఆణిముత్యాలు వున్నాయి. దైవవాణి అనే ఈ సెలయేరు నుండి అమృతధార పొంగి పొర్లుతోంది. ఉద్యానవనంలాంటి ఈ దివ్యగ్రంథంలో రంగురంగుల పూలు విరిసాయి. ఇదొక వజ్రవైఢూర్యాలతో నిండిన గని. దైవప్రవక్త ముహమ్మద్ (స) అనుచరులు ఈ జ్ఞానాబ్ది నుండి వివేచనా ముత్యాల్ని వెలికితీసారు, ఈ గని నుండే అత్యంత విలువైన వజ్రవైఢూర్యాలు ఒక్కటిగా ప్రోది చేయబడ్డాయి, ఈ ఉద్యానవనం నుండే వికసిత నవ యవ్వన విరులు మాలలుగా కట్టబడ్డాయి. విద్యా దాహార్తితో వున్న వారి దప్పిక ఈ జ్ఞాన జలంతోనే తీర్చబడింది.

## అంతిమ గ్రంథం

ఖుర్ఆన్ దేవుని అంతిమ గ్రంథం. ఈ గ్రంథం - గలేబుల్లో భద్రంగా దాచివుంచడానికి అవతరించలేదు, బీరువాల అలంకరణ కోసం అవతరించలేదు, కేవలం పఠించడానికే అవతరించలేదు - ఇది స్థాపించబడడానికే, దీని ఆజ్ఞలు అమలుకావడానికే అవతరించింది. ఈ గ్రంథం జిన్నులను, షైతాన్‌లను పారద్రోలడానికి అవతరించలేదు. తలబిరుసుతో ప్రవర్తించే పైశాచిక మానవుల్ని, జిన్నుల్ని గొలుసులతో బంధించడానికి పంపబడింది.

ఈ గ్రంథం దైవధిక్కారులకు అధికార హోదాల లైసెన్సు ఇవ్వడానికి రాలేదు. వారి నుండి అధికారం లాక్కొని దాన్ని సజ్జనులకు, నీతిమంతులకు హస్తగతం చేయడానికి వచ్చింది. ఈ గ్రంథం బానిస భావాల్ని నిర్మూలించి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల పాఠాలు బోధించడానికే వచ్చింది. అవమానం, అప్రతిష్టల స్థానే మనిషికి గౌరవం, ప్రేమాదరణలతో తలెత్తుకు తిరిగేలా చేయడానికి అవతరించింది. ఈ గ్రంథం దైవతిరస్కార పరిపాలనా విధానాన్ని తుదముట్టించి, అనుసరించే వారిని ప్రగతి శిఖరాలకు చేర్చింది. ఖిలాఫత్ (ప్రాతినిధ్య పరిపాలనా) వ్యవస్థ అధికారపు పగ్గాల్ని అప్పజెప్పి వారిని ప్రపంచ జాతులకు నాయకులుగా చేసింది.

## ఉత్తమ గ్రంథం

ఈ గ్రంథం సువాసన వ్యాప్తి చెందకుండా ఉండటానికి ఇది మూటకట్టిన కస్తూరీ కాదు. దీని బోధనలు సర్వసామాన్యం కాకుండా ఉండటానికి ఇది మూసిన గ్రంథం కాదు. ఎవరికీ అర్థం కాకపోవడానికి ఇది దయ్యాల భాషలో అవతరించలేదు. ఎవరూ గ్రహించలేకపోవటానికి ఇది మంత్రతంత్రాల పుస్తకం కాదు. ఇది ఎవరికీ అర్థం కాకపోవడానికి గారడి విద్యతో కూడిన గ్రంథం కూడా కాదు. ఇది ఉత్తమ మార్గదర్శక గ్రంథం. సామాన్యునికి సయితం సులువుగా అర్థమయ్యే విస్పష్ట భాషా గ్రంథం. దీని భాష ఎంతో మాధుర్యంగా వుండి సులభంగా అర్థమవుతుంది. దీని బోధనలు సామాన్యమైనవి, వాటిని గ్రహించుట ఏమంత కష్టతరం కాదు, శైలి కూడా సులభంగా సీదాసాదాగా వుంది. దాని చిన్న చిన్న వాక్యాల్లో మంత్ర ముగ్ధత వుంది. దాని పొడవైన సూరాలు అమృతంతో నిండి వున్నాయి.

## కరదీపిక

మహనీయ ముహమ్మద్ (స) నేతృత్వంలో నిర్వహించబడిన మహోద్యమానికి ఖుర్ఆన్ కరదీపికగా నిలిచింది. ఇందులో జీవితపు ప్రతి ఘట్టానికి సంబంధించిన మార్గదర్శకం ఉంది. నిత్య జీవనంలో ఎదురయ్యే సమస్యలన్నింటికీ సమాధానం కూడా వుంది.

ఇస్లాం ఓ సమగ్ర జీవన వ్యవస్థ. ఖుర్ఆన్ దానికి మూలాధారం. ప్రవక్త (స) సహచరులు దానికి కార్యరూపాన్నిచ్చారు. ఈ ఖుర్ఆనే ప్రవక్త సహచరుల జీవితాల్లో మహోన్నత విప్లవాన్ని తెచ్చి వారి జీవనాన్నే సమూలంగా మార్చివేసింది.

సహాబా (ప్రవక్త సహచరులు) (రజి) ఖుర్ఆన్‌ను తమ కళ్ళకద్దుకుని, హృదయాల్లో భద్రపరుచుకున్నారు. పఠించిన ప్రతి అక్షరాన్ని మనోఫలకంపై ముద్రించుకున్నారు. దాని సూరాల్ని కంఠస్థం చేసి గుర్తుంచుకున్నారు – అసలు వారి జీవనం ఖుర్ఆన్ ఛాయల్లో గడిచింది. అది వారి హృదయాల్లో కాంతులీనింది.

వారు (రజి) ఖుర్‌ఆన్‌ను పఠించి, అర్థం చేసుకున్నారు. దానిపై తమ మనస్సును లగ్నం చేసి ఆలోచించారు. పర్యవసానంగా దాన్ని ఆకళింపు చేసుకున్నారు. దాని ఆజ్ఞలేవో తెలుసుకుని వాటి ప్రకారం తమ జీవితాల్ని సంస్కరించుకున్నారు. ఖుర్‌ఆన్ బోధనల్ని వారు ఇతరులకూ తెలిపి, దాన్ని సర్వసాధారణం చేశారు. ఇంకా దాన్ని ప్రచారం చేయడమే తమ జీవిత లక్ష్యంగా భావించారు.

## సహాబి (రజి)ల దిన చర్య

వారు కాయకష్టం చేసేవారు, అరక దున్నేవారు, చెట్లు నాటి వాటిని సంరక్షించేవారు, తోటమాలులుగా పనిచేసేవారు, పశువుల్ని కాసేవారు, వర్తక, వాణిజ్యాల్ని నిర్వహించేవారు, అయినా ఖుర్‌ఆన్ పఠనాన్ని మాత్రం వారు ఏనాడూ మరువలేదు.

ప్రయాణం చేసేవారు, దైవ మార్గంలో వలస వెళ్ళేవారు, జిహాద్ (ధర్మపోరాటాని)కై బయలుదేరేవారు - కాని ఖుర్‌ఆన్ ఆజ్ఞల్ని ఏనాడూ మరిచేవారు కాదు. వారి ఇళ్ళు ఖుర్‌ఆన్ పఠనంతో ప్రతిధ్వనించేవి. వారి చర్చాగోష్ఠుల్లో ఖుర్‌ఆన్ ప్రస్తావించబడేది. మొత్తం మీద మేల్కొన్నా, పడుకున్నా, ఇంటిపట్టున ఉన్నా, ప్రయాణంలో వున్నా, నలుగురితో కలిసినా, ఎక్కడున్నా ఎలా వున్నా ఎల్లప్పుడూ వారి నోట ఖుర్‌ఆన్ వాక్యాలు జాలువారేవి.

సహాబా (రజి) వీధుల్లో సయితం దీని ప్రస్తావనను విడనాడలేదు, మస్జిదుల్లో దీని పాఠాల్ని బోధించేవారు. దర్బారుల్లో ఖుర్‌ఆన్ ప్రబోధాల్ని వెలుగెత్తి చాటేవారు, ఇళ్ళల్లో తమ సతీమణులకు హితబోధ చేస్తూ సంతానానికి తాకీదు చేసేవారు.

ఖుర్‌ఆన్ వారికి ఆధ్యాత్మిక ఆహారం లాంటిది. దాని పఠనం వారి కండ్లకు చలువనిచ్చేది. దాని ఆదేశానుసారం నడుచుకోవడం వారికి ఎంతో ఇష్టంగా వుండేది. ఖుర్‌ఆన్ బోధనల అనుసారం ప్రభుత్వాన్ని నిర్మించడం వారి లక్ష్యంగా వుండేది.

## వారి ఘనకార్యాలు

సహాబా (రజి) ఫిఖా (ఇస్లామీయ ధర్మశాస్త్రం)కు సంబంధించిన సమస్యల్లో

చిక్కుకోలేదు. తర్కవితర్కాల్లో తమ కాలాన్ని గడపలేదు. రహస్య విషయాలు తెలుసుకోవాలన్న తపన వారిలో ఎప్పుడూ ఉండేది కాదు. అస్పష్టమైన విషయాల జోలికి పోలేదు. వారు విస్పష్ట దైవాదేశాలకే ప్రాముఖ్యతనిచ్చి, దాని సార్వజనీన సందేశాన్ని స్వీకరించారు. ప్రపంచంలో దైవధర్మ సంస్థాపనకై వారు ప్రాణాలకు తెగించి కృషిచేశారు.

## మౌలిక దృక్పథం

ఇస్లామీయ ప్రభుత్వం అంటే కేవలం ఖుర్ఆన్ సూచించే ప్రభుత్వమే. దాని రాజ్యాంగం ఖుర్ఆన్ ఆదేశాజ్ఞల ప్రాతిపదికపై ఆధారపడి వుంది. సహాబా (రజి) సువిశాల ఇస్లామీయ సామ్రాజ్య స్థాపనకై ఉద్యుక్తులయ్యారు. దైవగ్రంథం, దైవ ప్రవక్త (స) సంప్రదాయం వారి మార్గదర్శకత్వానికి సర్వవిధాలా సహాయకారిగా నిల్చాయి. అధికార పగ్గాలు సదాచారులైన దైవదాసుల చేతుల్లోకి రానంతవరకు ఇస్లామీయ ప్రభుత్వ స్థాపన సాధ్యం కాదు.

ఈ విషయాన్ని సహాబా (రజి) గ్రహించడం వల్లే ఖుర్ఆన్ ప్రకారం ప్రభుత్వాన్ని స్థాపించడానికి దైవధిక్కారుల చేతుల్లోంచి అధికారాన్ని లాక్కొనేందుకు ప్రాణాల్ని సయితం పణంగా పెట్టారు.

## ఖుర్ఆన్ పేర్కొన్న ప్రభుత్వ స్థాపనకై పోరాటం

మక్కాలోని పీడిత జీవితం; అబిసీనియా, మదీనాలకు వలస, బదర్ యుద్ధం, ఉహుద్ పోరాటం, హునైన్‌లో అజ్ఞానమదాంధులతో భేటీ, కందక్ పోరాటంలో అవిశ్వాసుల సంయుక్త కూటమితో పోరాటం, ఖైబర్‌లో యూదులతో తలపడటం, మోతాలో రోమ్ సైన్యాన్ని ఎదుర్కోవటం, తబూక్‌లో ఇస్లామీయ సైన్య విజయకేతనం, మదీనాలో కపటుల్ని అణచటం - ఇవన్నీ వారు (రజి) ఖుర్ఆన్ ప్రభుత్వాన్ని స్థాపించటానికే చేశారు.

ముహమ్మద్ (స) సహచరుల జీవితాల్ని పరిశీలించండి - వారి ఘనకార్యా

లపై దృష్టి సారించండి. వారు ఇస్లాంకు సజీవ సదృశాలు, వారు ఖుర్ఆన్‌కు శబ్ద చిత్రాల్లాంటి వారు. వారి జీవితాలు దానికి సజీవ వ్యాఖ్యానాలు. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రవక్త (స) సహచరులు (రజి) ఖుర్ఆన్ సేవకులుగా, దాని పరివ్యాప్తకులుగా వ్యవహరించే వారు.

## హజ్రత్ సాలమ్ (రజి)

ఇస్లాం దివాకరుని ఉదయ కిరణాలు ఈరాన్ దేశంపై ప్రసరించాయి. ఈరాన్ నేల దైవ సందేశాన్ని స్వీకరించేందుకు పరితపిస్తోంది. ఫారిస్ కుమారుడు సల్మాన్ (రజి) హృదయం ఇస్లాం వెలుగును స్వీకరించింది. విశ్వసించిన ఈ సద్వర్తనునికి ప్రవక్త కుటుంబంలో చేరే సౌభాగ్యం లభించింది.

హజ్రత్ సాలమ్ (రజి) ఈరాన్ జాతీయులు. సబీత బిన్త్ యార్ గారి బానిస. ప్రవక్త ముహమ్మద్ (స) 'హిరా' గుహ నుంచి ఉత్తమ కానుక అయిన దైవవాణిని తీసుకువచ్చిన సందర్భంలో, దాన్ని స్వీకరించే భాగ్యం వీరికీ లభించింది. ఖుర్ఆన్ గ్రహీత (స) పవిత్ర నోట దైవవాణిని విన్న తరువాత ఆయన దానికి తన సర్వం సమర్పించుకోవడానికి సిద్ధమయ్యారు. ఆ వాణిని పఠించడమే తన వ్యాపకంగా మార్చుకున్నారు. దాని బోధనల్ని హృదయానికి హత్తుకున్నారు. దాని సువాసనలతో తన ఆత్మకు శాంతి స్థిమితాన్ని కలిగించుకున్నారు.

## ఖుర్ఆన్ పారాయణులుగా...

హజ్రత్ సాలమ్ (రజి) ఖుర్ఆన్ స్మర్త (ఖుర్ఆన్‌ని కంఠస్థం చేసిన వారు). ఖుర్ఆన్ బోధకులు. ఆయన ఇస్లామీయ ఉద్యానవనంలో శ్రావ్యకంఠంతో పాడే గానకోకిల. వీరు ఖుర్ఆన్‌ను కోయిలలా గానం చేసినప్పుడు ఇస్లామీయ ఉద్యానవనంలో ముకుళించిన వృక్షాలు పరవశించిపోయేవి. వినేవారంతా ఆకర్షితులయ్యేవారు. మత్తుగొలిపే వారి మధుర కంఠాన్ని విన్నప్పుడు మొగ్గలు విచ్చుకునేవి, పుష్ప వదనాలు పులకించిపొయ్యేవి. ఈ గాన మాధుర్యానికి ప్రజలు

తన్మయత్వం చెందేవారు. వారి హృదయాలు తబ్బిబ్బయ్యేవి, నీటి కెరటాలు కంపించిపోయేవి, కొండలు కదిలిపోయేవి.

## సత్సమాజ సహవాసి

ఇస్లామీయ బిడారు లక్ష్యంవైపు పయనిస్తున్నప్పుడు హజ్రత్ సాలమ్(రజి) ఆ సత్యపథగాములతో చేరిపోయారు. వీరంతా ఒకరికొకరు చేదోడు వాదోడుగా ప్రాణమిత్రులై పయనించేవారు. ఈ సమూహం అతిక్లిష్టమైన మక్కా ప్రాంతంలోని పరీక్షా మజిలీలు ఒక్కొక్కటే దాటుకుంటూ పురోగమించసాగింది. ఇలాంటి సంక్లిష్ట ప్రయాణంలో హజ్రత్ అబూ అబీదహ్ బిన్ అల్ జిరాహ్, హజ్రత్ సాలమ్ (రజి)కు తోడుగా నిలిచారు.

## మదీనాలో...

మక్కా నుండి బయలుదేరిన ఈ బాటసారుల బృందం మదీనా చేరుకుంది. హజ్రత్ సాలమ్ (రజి) కూడా హజ్రత్ అబూ హుజైఫా (రజి) వెంట మదీనా చేరుకున్నారు. మదీనా వాసులంతా బాటసారి బృంద నాయకులు (స) వారి సహచరుల కొరకు అసహనంతో ఎదురుచూడసాగారు. మదీనా చేరుకున్న హజ్రత్ సాలమ్ (రజి), హజ్రత్ ఉబాద బిన్ బషర్ (రజి) ఇంట అతిథిగా చేరారు.

మదీనా చేరుకున్న ఈ ఇస్లామీయ సమూహానికి అక్కడ ఘనంగా స్వాగతం లభించింది. ముహాజిర్ల (వలస వచ్చిన వారి)తో అన్సారీలు తమ చేతుల్ని, చేతల్ని కలిపారు. సంతోషంగా వారిని తమ ఇళ్ళకు తీసుకెళ్ళి వారి ప్రయాణ వివరాల్ని విన్నారు. ఆపై వారికి మనోస్థయిర్యాన్నిచ్చారు. హజ్రత్ సాలమ్ (రజి), మాజ్ బిన్ మాజ్ (రజి)మధ్య ప్రవక్త (స) సోదర బంధాన్ని ఏర్పరిచారు.

## క్లిష్ట పరిస్థితి

ఎట్టకేలకు ఇస్లామీయ బిడారు దైవమార్గంలో ఎదురైన కష్టాల్ని దాటి మదీనా చేరుకుని అక్కడే వుండిపోయింది. కాని అసలైన చిక్కుముడి విడిపోలేదు.

"చూడండి, ఓ సత్యపథగాములారా, మీకు అధిగమించవలసిన అసలు క్లిష్ట పరిస్థితి ఇదే"నంటూ ఖుర్ఆన్ పదే పదే హెచ్చరిస్తూనే వుంది:

"కష్టతరమైన ఆ కనుమ అంటే ఏమిటో మీకు తెలుసా? ఎవరినైనా బానిసత్వపు బంధనాల నుండి విముక్తి గావించటం, లేదా ఆకలిగొన్న రోజున సమీప అనాథకు లేదా దిక్కులేని నిరుపేదకు అన్నం పెట్టడం."

(అల్ బలద్)

## స్వేచ్ఛా వాయువులు

సత్యపథగాములు ఖుర్ఆన్ పిలుపును విని దాన్ని అంగీకరిస్తూ బానిస స్త్రీ, పురుషుల్ని విమోచనం చేయసాగారు. ధనికులైన సహచరులు తమ సంపదతో బానిసల్ని కొని దైవ మార్గాన వారిని స్వేచ్ఛా వాయువుల్ని పీల్చుకునేందుకు విడుదల చేశారు. హ|జ్రత్ సబీత బిన్త్ యాఅర్ (రజి) దైవాజ్ఞ ప్రకారం హ|జ్రత్ సాలమ్ (రజి)ని బానిసత్వం నుంచి విడుదల గావించారు.

హ|జ్రత్ సాలమ్ (రజి) బానిసత్వపు బంధనాల నుండి విడుదలైనప్పుడు హ|జ్రత్ అబూ హుజైఫా (రజి) ముందుకు వచ్చి ఆయన్ని తన పెంపుడు కొడుకుగా స్వీకరించారు. హ|జ్రత్ సహ్లా బిన్తె సుహైల్, హ|జ్రత్ సాలమ్ (రజి)ని తన కన్న కొడుకులా చూసుకునేవారు.

## సాలమ్ బిన్ అబూ హుజైఫా (రజి)

హ|జ్రత్ సాలమ్ (రజి), అబూ హుజైఫా (రజి) గారి కుటుంబ సభ్యులయ్యారు. ఓ ఈరానీ జాతీయునికి ఖురైషీ వంశ సభ్యునిగా మారే యోగ్యతా భాగ్యం లభించింది. ఆ రోజు నుంచి హ|జ్రత్ సాలమ్ (రజి), సాలమ్ బిన్ అబూ హుజైఫా (రజి)గా పిలవబడుతూ వచ్చారు.

## వివాహం

ఇస్లామ్ నిమ్నోన్నతల్ని, అంటరానితనాన్ని, యజమాని-బానిస, పెద్దవాళ్ళు-చిన్నవాళ్ళు, ధనికులు-పేదలు అనే వివక్షను రూపుమాపింది. ఇస్లామ్‌ను

స్వీకరించిన వాడెవడయినా ఇస్లామీయ సమాజంలో సభ్యునిగా పరిగణించబడేవాడు. ఇస్లామీయ సమాజంలో మనిషి రంగురూపాలు చూడబడవు, కేవలం అతని గుణగణాలు, దైవభీతినే గణించడం జరుగుతుంది. దైవ మార్గంలో త్యాగాలు చేస్తూ, దేవుని కోసం వలస వెళ్ళేవారే గౌరవాదరణలకు అర్హులు.

యాసిర్, అమ్మార్, బిలాల్, ఖబ్బాబ్, జైద్, ఉసామా, సుహీబ్, సాలమ్ (రజి అల్లాహు తఆలా అన్‌హుమ్)లు దైవ ప్రబోధనం అనే నింగిలో మెరిసే నక్షత్రాలుగా ముస్లింలకు ప్రియనేస్తాలుగా నిలిచారు.

సయ్యద్ బిలాల్ (రజి) నీగ్రో జాతికి చెందిన బానిస. హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి) వీరిని బానిస శృంఖలాల నుండి విముక్తి చేసి తన కుమార్తెనిచ్చి వివాహం చేశారు. హజ్రత్ జైద్ బిన్ హారిస్ (దైవప్రవక్త (స) ద్వారా విమోచనం చేయబడిన బానిస) వివాహం స్వయంగా ప్రవక్త (స) తన మేనత్త కూతురు హజ్రత్ జైనబ్ (రజి)తో జరిపించారు. హజ్రత్ జైద్ బిన్ హారిస్, హజ్రత్ జైనబ్‌ల మధ్య పొరపొచ్చాలేర్పడి ఇద్దరూ విడిపోయిన తరువాత హజ్రత్ జైనబ్ (రజి)ను దైవ ప్రవక్త (స) వివాహమాడారు. ఆ విధంగా వారు ఉమ్ముల్ మోమినీన్ (ముస్లింల మాతృమూర్తి) అయ్యారు.

హజ్రత్ అబూ హుజైఫా (రజి) ఇస్లామీయ ఆజ్ఞల ప్రకారం తన తమ్ముడి కూతురు ఫాతిమా వివాహం హజ్రత్ సాలమ్ (రజి)తో జరిపించారు. ఆ విధంగా హజ్రత్ సాలమ్ (రజి) ఖురైష్ వంశ సభ్యులుగా మారారు. దీంతో వారికి ఖురైషీయుల అల్లుడయ్యే భాగ్యం ప్రాప్తించింది.

## అబూ హుజైఫా తనయునిగా

హజ్రత్ సాలమ్ (రజి), హజ్రత్ అబూ హుజైఫా (రజి) కుమారునిగా ప్రసిద్ధి చెందారు. **అద్‌వూ హుమ్ లా బాహుమ్** (ప్రజల్ని వారి తండ్రి, తాతల పేర్లతో పిలవండి) అన్న ఖుర్‌ఆన్ ఆయత్ అవతరించాక హజ్రత్ సాలమ్ (రజి) మౌలా అబూ హుజైఫా (రజి)గా పిలవబడ్డారు.

హజ్రత్ హుజైఫా (రజి) సతీమణి హజ్రత్ సహ్లా బిన్తె సుహైల్ (రజి), హజ్రత్ సాలమ్ (రజి)ని తన కన్న కుమారునిలా చూసుకునే వారు. హజ్రత్ సాలమ్ (రజి)ని చూడకుండా ఒక్క రోజయినా గడిపేవారు కాదు. ఒకసారి ఆమె ప్రవక్త (స) సన్నిధిలో హాజరై "రసూలుల్లాహ్! సాలమ్‌ను మేము మా కన్నకొడుకుగానే భావిస్తున్నాం. ఇంతకు ముందు ఆయన మా ఇంటికి వస్తూ పోతుండేవారు, వీరి రాకపై అబూ హుజైఫా తన అయిష్టతను కనబరిచేవారు" అని విన్నవించారు.

సమాధానంగా దైవప్రవక్త (స) "ఆయనకు మీ పాలు త్రాపించండి. అప్పుడు మీకు ఆయన హరామ్ అవుతారు" అని అన్నారు. ఆయన (స) సలహా ప్రకారం హజ్రత్ సహ్లా (రజి) సాలమ్ (రజి)కు తన పాలు త్రాపించారు. అలా హజ్రత్ సాలమ్(రజి), హజ్రత్ అబూ హుజైఫా(రజి)కు ప్రియసుతుడుగా మారిపోయారు.

> ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ సల్మా (రజి) ఉల్లేఖించారు: "సాలమ్ (రజి)కు ప్రత్యేక అనుమతి లభించింది. ఎందుకంటే యుక్త వయస్కులైన వారికి ఈ విధమైన అనుమతి లభించదు." (అబూదావూద్-కితాబున్నికాహ్)

## షైతాన్ పన్నాగం

షైతాన్ మానవుల శాశ్వత శత్రువు. మానవుడు ఖుర్ఆన్ ప్రకారం జీవితాన్ని గడపడం, ఆ సందేశం సర్వసామాన్యమై వృద్ధి చెందటం షైతాన్‌కు సుతరామూ ఇష్టముండదు.

ఇస్లాంకు వ్యతిరేకంగా షైతాన్ అనేక పన్నాగాలు, కుయుక్తులు పన్నుతాడు. ఒక్కోసారి అపోహలు, అనుమానాలు వ్యాపింపజేస్తాడు. వదంతులు అపనిందల తుఫాను రేపడం అతని లక్షణం. ఇస్లాం పథగాములు పటిష్ఠమై తన లక్ష్యానికి చేరువగా ప్రయాణం సాగిస్తున్నప్పుడు ఆ మార్గంలో ఎన్నో అడ్డుగోడల్ని నిలుపుతాడు. ఆ ధర్మపథంలో పెద్ద పెద్ద కష్టాల కొండల్ని సృష్టించి అడ్డుకునే ప్రయత్నం చేస్తాడు. అప్పటికీ అతని వల్ల కాకపోతే తన చివరి ప్రయత్నంగా తన బలగాన్ని కూడగట్టుకుని వారిని ఇస్లాంపైకి వుసిగొలుపుతాడు. అయితే ఇస్లామీయ పథగాములపై

దైవానుగ్రహం వర్షించి వారికి సహాయంగా దైవదూతల సైన్యం రావడం చూసి, భయకంపితుడై అక్కణ్ణుంచి పలాయనమవుతాడు.

బదర్, ఉహుద్, ఖందఖ్, హునైన్, తాయెఫ్ ఇంకా తబూక్ పోరాటాలు షైతాన్ సృష్టించిన కుట్ర, కుతంత్రాల ఫలితమే.

అయితే ఇస్లామీయ ధ్వజవాహకులు ఆ ఎత్తుగడల్ని, అతని దుశ్చేష్టల్ని బాగా ఎరుగుదురు. ధర్మపథ నాయకుని (స) ఆధ్వర్యంలో వారు షైతాన్‌ను ప్రతిసారీ పరాజయంపాలు చేశారు. అతని కుట్రల్ని వమ్ము చేశారు. అతను పరచిన వలల్ని తునాతునకలు చేశారు. అతని ఆశల్ని అగ్నిపాలు చేసి, అతని గొప్పదనాన్ని భంగం చేశారు. అతని సంతోష వార్తల్లో విషాన్ని విరజిమ్మి, గాలి కబుర్లలోంచి గాలి తీసేశారు.

హజ్రత్ సాలమ్ (రజి) ఈ పోరాటాలన్నింటిలో పాల్గొన్నారు. ఆయన (రజి) తన సహచరులతో కలిసి పదునైన తన కత్తితో షైతానీ మూకల్ని లొంగుబాటుచేసుకుని, అతని కుట్రల్ని వమ్ముచేశారు.

## షైతాన్ పరాజయం

ఏ రోజైతే మక్కా జయించబడిందో అదే రోజు షైతాన్ తన పెట్టే బేడా సర్దుకుని అరబ్ భూభాగం నుండి పరారయ్యాడు. ఇది ఇస్లామీయ చరిత్రలో మొదటి విజయం. ఇక ఇస్లాం విజయపరంపర మొదలవసాగింది. పుడమి యావత్తూ దైవ నామంతో వెలుగును చూడబోతోంది. ఇస్లాం సౌరభం వ్యాపించనుంది; మక్కా విజయానికి ముందే వివిధ చక్రవర్తులకు ఈ సందేశాన్ని పంపి ఇస్లాంను స్వీకరించమని, వారి సామ్రాజ్యంలో ఈ శుభవార్తను వినిపించమని సందేశాలు పంపడం జరిగింది.

## దైవ సందేశ పరిపూర్తి

యావత్తు అరబ్బు భూభాగం ఖుర్‌ఆన్ ఛత్రం క్రిందికి వచ్చింది. ఖుర్‌ఆన్ ఆదేశాలు అమల్లోకి వచ్చాయి. ఇస్లామీయ రాజ్యం స్థాపించబడి, అంటే దేవుని

నేలపై దైవ సా(మ్రాజ్యం స్థాపించబడింది. ఖుర్ఆన్ గ్రహీత (స) తన దైవదౌత్య బాధ్యతలో కృతార్థులయ్యారు.

## దైవదౌత్యపు పరిసమాప్తి

దైవం ముహమ్మద్ (స)ను లోక కారుణ్యమూర్తిగా ప్రభవింపజేశాడు. అంతకు క్రితం ఏ ప్రవక్తకూ ఇలాంటి ఉన్నత పదవిని ఇవ్వలేదు దైవం. ఇంకా దైవం ప్రవక్త (స)ను తన చివరి ప్రవక్తగా పంపినట్లు సెలవిచ్చాడు. అందువలన దైవదౌత్యం వారితోనే అంతమయ్యింది. ఇక మరో ప్రవక్తా ప్రభవించడు, మరే షరీఅత్ అవతరించదు. ఏ ఒక్క వ్యక్తీ ప్రవక్తగా ముద్రవేసుకుని ముందుకు రాలేదు. దైవదౌత్యంలోగాని, ప్రవక్తృత్వంలోగాని ఎవరికీ ఎలాంటి భాగస్వామ్యం లేదు.

ఖుర్ఆన్ గ్రహీత (స) దేవుని చివరి ప్రవక్త, చివరి సందేశహరుడూను. వీరి తరువాత దైవదౌత్యం అనే ఇంటి తలుపులు శాశ్వతంగా మూయబడ్డాయి.

## మెరిసే తార

దైవసందేశహరులు (స) పరమపదించగా దివ్యవాణిని గ్రహించిన తారలు వెలుగులు విరజిమ్మడం ప్రారంభించాయి. ఈ నక్షత్ర సమూహంలో దైవదౌత్యాన్ని సంపూర్ణంగా అంగీకరించి వెలుగులు విరజిమ్మిన తార హ(జత్ అబూ బకర్ సిద్దీఖ్ (రజి). వీరి పూర్తి జీవితం ఖుర్ఆన్ ఛాయలో, ప్రవక్త (స) సహచర్యంలో గడిచింది.

ఇస్లామీయ సమాజ సభ్యులందరూ ముస్లిం సమాజ బాధ్యతల్ని సిద్దీఖ్ అక్బర్ (రజి)కు అప్పజెప్పారు. సయ్యిదినా అబూ బకర్ సిద్దీఖ్ (రజి) ఖుర్ఆన్, ప్రవక్త సంప్రదాయం అనే రెండు కాగడాలను చేతబూని సమాజ నాయకత్వ బాధ్యతను చేపట్టి, ముస్లిం సమాజాన్ని తన అసలు లక్ష్యం వైపునకు నడిపించ సాగారు.

## అసత్య ప్రవక్త

అకస్మాత్తుగా తుఫాన్ వీచే సూచనలు కనిపించసాగాయి. ఆకాశంలో కారుమేఘాలు కమ్ముకున్నాయి, ఉధృతంగా గాలివాన వీస్తోంది, సత్యపథగాముల బృందం ఈ తుఫానుకు తట్టుకొని ఇంకా సరిగా నిలబడనేలేదు; అంతలో ఎక్కడో పొంచి ఉన్న దోపిడీ దొంగలు ఈ బృందంపై దాడిచేశారు. దైవ తిరస్కారులు, ధర్మభ్రష్టులు, అసత్య ప్రవక్తలు నాలుగు దిక్కుల నుండి విజృంభించారు. వాళ్ళందరిలో ప్రమాదకరమైన దోపిడీ దొంగ ముసాలెమా అనే అబద్ధీకుడు. ఇతను అంతిమ దైవప్రవక్త (స) జీవిత కాలంలోనే తనకు తాను దైవప్రవక్త అని (దైవం మన్నించుగాక) ప్రకటించుకున్నాడు. ఆయన దైవదౌత్యాన్ని అంగీకరిస్తూనే తనకూ దైవదౌత్యంలో భాగస్వామ్యముందంటూ వాదించేవాడు.

దైవప్రవక్త (స) అతని వాదనను తిప్పికొట్టారు. ఆపై అతను భవిష్యత్తులో ప్రవక్త అయ్యే దావా చేస్తూ మందిని పోగుచేసి ఇస్లామీయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్రలు పన్నడం ప్రారంభించాడు. ఇతని దావా ప్రవక్త (స) దైవదౌత్యానికి ఓ కళంకం. ఈ అబద్ధాన్ని ఇస్లామీయ సమాజం భరించలేకుండా వుండింది. ఈ నకిలీ ప్రవక్తను, అతని అబద్ధపు దౌత్యాన్ని సర్వవిధాల అణచేందుకు ప్రవక్త (స) సహచరులు సర్వసన్నద్ధులయ్యారు.

## దైవదౌత్య పరిరక్షకులు

అబద్ధీకుడు ముసాలెమా పీచమణచడానికి హజ్రత్ అబూ బకర్ సిద్దీఖ్ (రజి), హజ్రత్ సాలమ్ (రజి) నాయకత్వంలో ఓ సైన్యాన్ని పంపారు. ముహాజిర్ల బలగాన్నంతా కూడగట్టుకున్నారు ఆయన (రజి). ఈ అబద్ధపు దావేదారులపై సాగిన పోరాటంలో హజ్రత్ అబూ హుజైఫా (రజి) కూడా పాల్గొన్నారు.

హజ్రత్ సాలమ్ (రజి) నాయకత్వాన్ని వ్యతిరేకిస్తూ, "మాకు మీ నాయకత్వంపై అనుమానంగా వుంది, అందుచేత మేము మరొకతన్ని నాయకునిగా ఎన్నుకుంటాం" అని అన్నాడు ఓ వ్యక్తి.

సమాధానంగా హజ్రత్ సాలమ్(రజి), "ఒకవేళ నేను పిరికితనాన్ని చూపితే ఖుర్‌ఆన్‌ని నమ్మని దురదృష్టవంతుల్లో చేరిపోతాను" అన్నారు.

ఇరువర్గాలూ బాగా యుద్ధ వేడిని పుంజుకున్నాయి. హజ్రత్ సాలమ్ (రజి) అబద్ధపు దావేదార్లపై పెనుతుఫానులా విరుచుకుపడి, వారి సైన్యాన్ని చెల్లాచెదురు చేశారు. ఈ విధంగా పోరాడుతూ వున్నప్పుడు వారి కుడిచేయి తెగిపోయింది, తరువాత ఇస్లామీయ కేతనాన్ని తన ఎడమ చేతిలోకి తీసుకున్నారు. ఆ ఎడమ చేయీ తెగిపోగా గోడను ఆసరాగా చేసుకుని జెండాను తన రొమ్ముపై అదిమి పట్టుకున్నారు. గాయాలతో వళ్ళంతా హూనం అయింది. ఆ స్థితిలోనూ అబూ హుజైఫా (రజి) ఎలా వున్నారని అడిగారు.

సమాధానంగా ప్రజలన్నారు - అబూ హుజైఫా (రజి) షహీద్ (అమరగతి) అయ్యారు. మళ్ళీ, "నాపై అనుమానం వ్యక్తం చేసిన ఆ వ్యక్తి ఎక్కడున్నాడ"ని అడిగారు. "అతనూ షహీద్ అయ్యాడ"న్న సమాధానం వచ్చింది ప్రజల్నుంచి. "నన్ను వారిద్దరి మధ్య ఖననం చేయండి" అని అక్కడున్న వారితో అన్నారు.

## అమరవీరుడు

వీరి అమరగతిపై మరోచోట ఇలా ప్రస్తావించబడింది- పోరాట సమయంలో ముస్లిముల అడుగులు తడబడుతూ వున్న పరిస్థితిని చూసి హజ్రత్ సాలమ్(రజి) అన్నారు - "ఎంత విచారకరమైన పరిస్థితి దాపురించింది. దైవప్రవక్త (స) పట్ల మా ప్రవర్తన ఇలా ఉండలేదు." తరువాత ఆయన ఓ గుంట త్రవ్వి అందులోకి దిగి ఇస్లామీయ కేతనాన్ని సంబాళించుకున్నారు. ఆపై శత్రువులతో వీరోచితంగా పోరాడుతూ షహీద్ అయ్యారు. యుద్ధం ముగిశాక జనం చూశారు - హజ్రత్ సాలమ్ (రజి) తల హజ్రత్ అబూ హుజైఫా (రజి) కాళ్ల వద్ద పడివుంది.

(ఇబ్నె సఅద్)

## శాశ్వత యశస్వి

నీపై శుభాశీస్సులు! ఓ ఇస్లామీయ అమరవీరా! ఖుర్‌ఆన్‌పై సాక్ష్యం పలికినవాడా! చివరి దైవ సందేశాన్ని పరిరక్షించిన వాడా! నీవు ఖుర్‌ఆన్ భద్రతకు

నీ రక్తాన్ని ధారపోశావు. నీ దేహం నుండి చిమ్మిన రక్తధారతో ఇది చివరి దైవ దౌత్యంగా ముద్రవేశావు. నీ అమరగతిపై వేనవేల జీవితాలు సమర్పితం. అమరగతి పొందినప్పుడు మీ నోటి వెంట ఖుర్ఆన్ ఆయత్‌లు వెల్లువలా వెలికివచ్చాయి.

## ఖుర్ఆన్ పండితునిగా...

దైవప్రవక్త (స), "ఖుర్ఆన్‌ను నలుగురు వ్యక్తుల నుండి అభ్యసించండి" అని ప్రవచించేవారు. వారు:

1. అబ్దుల్లా బిన్ మసూద్ (రజి)
2. సాలమ్ మౌలా బిన్ హుజైఫా (రజి)
3. అబీ బిన్ కఅబ్ (రజి), ఇంకా
4. మాజ్ బిన్ జబల్ (రజి) (బుఖారి)

## మాధుర్యం

ఒకసారి హజ్రత్ ఆయెషా (రజి)కు దైవప్రవక్త (స) సన్నిధిలో హాజరవడంలో కొంచెం ఆలస్యం జరిగింది. ఆలస్యానికి కారణం అడిగారు ప్రవక్త (స). "ఓ ఖారి (ఖుర్ఆన్ పఠించేవాడు) ఖుర్ఆన్‌ను పఠిస్తూ వుండగా దాన్ని విని వచ్చాను. అందుకని ఆలస్యం జరిగిందని" హజ్రత్ ఆయెషా (రజి) సంజాయిషీ యిచ్చుకున్నారు. వీరి పఠనం పట్ల, హజ్రత్ ఆయెషా (రజి) ఆశ్చర్యం వ్యక్తం చేయగా ప్రవక్త (స) సయితం తన దుప్పటిని సరిచేసుకుని బయటికి వచ్చి చూస్తే అక్కడ హజ్రత్ సాలమ్ (రజి) వున్నారు. దైవ ప్రవక్త (స) సంతోషించి, "నీలాంటి వ్యక్తిని నా ఉమ్మత్ (అనుచర సమాజం)లో ప్రభవింపజేసినందుకు దైవానికి కృతజ్ఞతలు" అని సెలవిచ్చారు.

(అస్‌హాబా : సాలమ్ మౌలా అబూ హుజైఫా (రజి) చరిత్ర నుండి సేకరణ)

## హజ్రత్ ఉమర్ (రజి) గారి సలహా

హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి) హజ్రత్ సాలమ్ (రజి)ను ఎంతో

ప్రశంసించేవారు. తన తరువాత ఖలీఫాను ఎన్నుకునే విషయంలో ఆయన (రజి) ఎంతో నమ్మకంతో తన సలహాను ఇచ్చారు :

"ఒకవేళ సాలమ్ (రజి) జీవించివుంటే నేను వారినే ఖలీఫాగా ఎన్ను కుంటాను. ఈ సమస్యను సలహా మండలి వరకు కూడా పోనిచ్చేవాణ్ణి కాను." (అసదుల్ గాబ)

ఖుర్‌ఆన్ పఠనంలో హజ్రత్ సాలమ్(రజి) కంఠ మాధుర్యంపై సహాబా (రజి) అంతా వారిని ఎంతో గౌరవించేవారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) సెలవిచ్చారు:

దైవప్రవక్త (స) మదీనాకు రాకపూర్వం ముహాజిర్ల (వలసవచ్చిన వారు)కు మస్జిదె ఖుబాలో హజ్రత్ సాలమ్ (రజి) ఇమామ్ (నాయకులు)గా వ్యవహ రించేవారు. (బుఖారి)

## ఖుర్‌ఆన్ ఖారీగా...

మక్కాలో విన్పించిన మీ తియ్యని గానం మదీనాలో రెట్టింపయ్యింది. నేడు అది నేల నాలుగు చెరగులా మలయ మారుతంలా వ్యాపించింది. ఖుర్‌ఆన్ ఒకనాడు, పుస్తక భాండాగారాలు, పాఠశాలల వరకు పరిమితమై వుండేది, పట్టు వస్త్రాల్లో చుట్టబడి అల్మేరాల్లో అలంకరించబడి వుండేది, సామాన్య ముస్లిం చెవులకు దాని బోధనలు సోకలేదు, ఖుర్‌ఆన్ బోధనల్ని ఆకళింపుచేసుకున్న వారు సయితం స్వయంగా వాటి ప్రకారం ఆచరించేవారు కాదు, ఇతరులను ఆచరించమని బోధించేవారూ కాదు. ఆ పాత కాలమంతా గడిచిపోయింది. నేడు ప్రపంచమంతా ఖుర్‌ఆన్ బోధనల వైపు మొగ్గుతోంది. దాని బోధనలు సర్వసామాన్యమై వాటిపై పరిశీలన జరుగుతోంది.

ఓ ఖుర్‌ఆన్ గ్రహీతా! ఇస్లామీయ ఉద్యమాలు పునరుజ్జీవనమయ్యాయి, ధర్మపోరాట వీరుల బలగం విరుచుకుపడింది. ఇస్లాం (జ్ఞానం) మరియు అజ్ఞానం మధ్య పోరాటం మొదలయ్యింది. సత్యాసత్యాల మధ్య సమరం ప్రారంభమై ఇస్లాంకు విజయం చేకూరే శుభతరుణం రాబోతోంది.

ఓ చివరి దైవదౌత్య పరిరక్షకుడా! ప్రపంచంలో అబద్ధపు దైవదౌత్య దావా దీపాలు తలెత్తాయి. వాటిని ఆర్పివేయడానికి త్యాగధనులు తెగింపుతో బయలుదేరారు.

ఓ మార్గదర్శకుడా! అదిగో, అటు చూడండి, ధర్మవీరులు ఇస్లామీయ కేతనాన్ని ఎగరేసుకుంటూ వస్తున్నారు, షైతాన్ సైన్యంలో కలకలం పుట్టుకొచ్చింది, ఇస్లామ్ శత్రువుల బలం సన్నగిల్లసాగింది, వాటి ఆయువు క్షీణదశకు చేరుకుంది, వారు అచేతనులై తాము తయారు చేసుకున్న స్వాముల వద్దకు తమ రక్షణార్థం పరుగెత్తుతున్నారు.

ఓ దైవదౌత్య గ్రహీతా, మీరు వెలిగించిన కాంతిమంతపు దీపాన్ని దేదీప్యమానంగా ఉంచుతాం, అబద్ధపు దైవప్రవక్తల దావా దీపాల్ని వెలగకుండా చూస్తాం.

**-: సమాప్తం : -**